శ్రీమతే రామానుజాయ నమః



శ్రీ పరాశర భట్టర్ ప్రణీతమైన

# శ్రీరంగనాథ స్తోత్రము

## సవ్యాఖ్యానము

వ్యాఖ్యాత

పండితరత్న, వేదాన్తవాచస్పతి

ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు

**ఉభయవేదాంత మహా విద్వాన్**

**ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారి**

**113వ తిరునక్షత్రోత్సవ జ్ఞాపిక**

**2011**

శ్రీ పరాశర భట్టర్ ప్రణీతమైన

# శ్రీరంగనాథ స్తోత్రము - సవ్యాఖ్యానము

వ్యాఖ్యాత : పండితరత్న, వేదాన్తవాచస్పతి,
సంప్రదాయవిద్వన్మణి
ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ.
శింగరాచార్యులుగారు

ప్రథమ ముద్రణము : 2005

ద్వితీయ ముద్రణము : 2011

సందర్భము : ఉభయవేదాంత మహా విద్వాన్
ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి
శేషశింగరాచార్యస్వామివారి
113వ తిరునక్షత్రోత్సవము

వేదిక : చతుర్థ ఉభయవేదాంత పండిత సభలు,
శ్రీభాష్యకార భవనము, నరసాపురము.

ప్రతులు : 500



వెల : అమూల్యము

ముఖచిత్రం : శ్రీరంగనాచ్చియార్, నమ్బెరుమాళ్ (శ్రీరంగం)

ప్రతులకు : శ్రీమతి ఈ. జయలక్ష్మి
18-3-58/7, శాంతినగర్
ఖాదీకాలనీ, కె.టి. రోడ్, తిరుపతి-517 507
ఫోన్ : 0877-2232091, 098850 03420

డి.టి.పి. : శ్రీ చంద్రశేఖర్, తిరుపతి



## ఆశయనివేదన

**జయతుతరాం రామానుజసిద్ధాంతః పరమవైదికో జగతి ।**
**దేశికగోష్ఠీ దక్షా తన్నిర్వాహే చ జేజీయాత్ ॥**

**శ్రీశేషశింగరార్య శ్శుభగుణనిలయః పితామహో జయతు ।**
**ఉపయాతో వస్తుత్వం దాసోఽయం యస్య భవ్యవీక్షాతః ॥**

అస్మత్పితామహచరణులు ఉ.వే. మహావిద్వాన్ ఈయుణ్ణి శేషశింగరాచార్య స్వామివారు అవతరించి నూఱు సంవత్సరాలు పూర్తి అయిన సందర్భంలో వారి శతాబ్దిమహోత్సవాలు 1999వ సంవత్సరం ఏప్రియల్ నెల చివరలో వారు చిరకాలం నివసించిన స్వగ్రామం అంతర్వేదిపాలెంలో బంధుమిత్రుల, శ్రేయోభిలాషుల, ఆత్మీయుల, శిష్యవర్గాల సహాయసహకారాలతో, భగవద్భాగవతమంగళాశాసనాలతో అత్యంతవైభవంగా నిర్వహింపబడ్డాయి. ఆ సంవత్సరంనుండి ఇప్పటివరకు ప్రతిఏడు పితామహపాదుల తిరునక్షత్రోత్సవాన్ని పురస్కరించుకొని విశేషమైన కార్యక్రమాలు వారి దివ్యకృపవల్ల నిర్విఘ్నంగా, నిరంతరాయంగా కొనసాగుతున్నాయి. శ్రీమాన్ తాతగారి తిరునక్షత్రోత్సవ సందర్భంలో భగవద్రామానుజ దర్శనాన్ని ప్రచారం చేస్తున్న విద్వాంసులను ఆహ్వానించి, వారిని యథాశక్తి సంమానించే కార్యక్రమంకూడా అప్రతిహతంగా కొనసాగుతున్నది. ఈవిధంగా కవిశాబ్దికకేసరి, శాస్త్రరత్నాకర, మహామహోపాధ్యాయ, శాస్త్రవిద్వన్మణి, ఉవే శ్రీమాన్ డా॥ ఎస్.ఎన్.సి. రఘునాథాచార్య స్వామివారు (వరంగల్లు), శ్రీవైష్ణవసింహ, ఉ.వే. శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు (తిరుపతి), ఉభయవేదాంత వాచస్పతి, పండితరత్న, ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారు (నరసాపురం), శాస్త్రరత్నాకర, పండితరత్న, శాస్త్ర విద్వన్మణి, ఉ.వే. శ్రీమాన్ డా॥ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామివారు (హైదరాబాద్), సువచః శ్రీవల్లభ పండితరత్న, శాస్త్రవిద్వన్మణి, వాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు (సింహాచలం), ఉ.వే. శ్రీమాన్ ప్రొఫెసర్ ఎం. నరసింహాచార్యస్వామివారు (చెన్నై), ఉ.వే. శ్రీమాన్ తూపురాణి ఉడైయర్లు స్వామివారు, పండితరత్న, శాస్త్ర విద్వన్మణి, వాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ డా॥ కె.వి. రాఘవాచార్యస్వామివారు (హైదరాబాద్), ఉ.వే. శ్రీమాన్ కె.ఇ.టి. రామానుజాచార్యస్వామివారు (బాపట్ల) సంమానింపబడగా, ఈ ఏడు భాగవతామృతవర్షి, ఉభయవేదాంత వాచస్పతి, ఉ.వే. శ్రీమాన్ సాతులూరు గోపాలకృష్ణమాచార్యస్వామివారు అస్మత్ పితామహుల తిరునక్షత్రోత్సవాలను అలంకరించి, సంమానాన్ని స్వీకరించబోవడం విశేషం.

పితామహపాదుల తిరునక్షత్రమహోత్సవ నిర్వహణం, పండితసంమాన కార్యక్రమ నిర్వహణం ప్రతిఏడు దాసుని పితృపాదులు, న్యాయవేదాంతవిద్వాన్

ఈయుణ్ణి రంగాచార్య స్వామివారి పర్యవేక్షణలో జరుగుతున్నవి. శ్రీమాన్ పితృపాదులు 2000వ సంవత్సరంనుండి తమ నివాసం నరసాపురానికి మార్చినందువల్ల, ఈ కార్యక్రమాలు నరసాపురంలోని భారద్వాజ భవనంలో కొన్ని సంవత్సరాలు జరిగినవి. గత నాల్గు ఏండ్లుగా నరసాపురంలోని శ్రీభాష్యకారభవనంలో ఆ సంస్థనిర్వాహకుల సౌజన్యంతో నిర్వహింపబడుతున్నాయి.

నరసాపురం, అంతర్వేదిపాలెం ప్రాంతంలో శ్రీరామానుజసంప్రదాయంలో అభినివేశాన్ని, భక్తిశ్రద్ధలను కల కొందఱు భక్తుల ప్రోత్సాహంతో శ్రీరామానుజదర్శక ప్రచారకసభ 2008వ సంవత్సరంలో ఏర్పాటుచేయబడింది. ఈ సభద్వారా 2008వ సంవత్సరంనుండి శ్రీపితామహపాదుల తిరునక్షత్రోత్సవాన్ని పురస్కరించుకొని మూడు దినాలపాటు ఉభయవేదాంత పండితసభాకార్యక్రమంకూడా నిర్వహింపబడుతున్నది. ఈ ఏడు ఈ సభలు ఏప్రియల్ 22వ తేదీనుండి 24వ తేదీ వరకు జరుగగలవు. పితామహచరణుల తిరునక్షత్రోత్సవనిర్వహణం, పండితసంమాన కార్యక్రమ నిర్వహణం, ఉభయవేదాంత పండితసభానిర్వహణం - ఇవి అన్నీ శ్రీ ఆదికేశవస్వామి, ఎంబెరుమానార్ స్వామివార్ల దివ్యానుగ్రహంవల్ల నిర్విఘ్నంగా జరుగుతున్నాయి. అస్మదాచార్యులైన పితామహచరణుల ముఖోల్లాసం కోసం, భగవద్భాగవతాచార్య సంసేవనం కోసం చేసే ఈ కార్యక్రమాలకు పలు రీతులలో చేయూతనిచ్చే ఎంతోమంది శ్రేయోభిలాషులకు, ఆత్మీయులకు, స్థానికులకు హార్దికంగా కృతజ్ఞతలను నివేదించు కుంటున్నాను.

శ్రీమాన్ తాతగారి శతాబ్దిమహోత్సవాలనుండి ప్రతి ఏడు వారి తిరునక్షత్రోత్సవ కార్యక్రమాల సమయంలో ఒక సద్గ్రంథం ప్రచురింపబడి ప్రపన్నులకు అందజేయబడుతున్నది. శతాబ్దిఉత్సవాలలో దాసుడు రచించిన శ్రీరంగరాజస్తవం పూర్వశతక వ్యాఖ్యానం - వరివస్య ప్రచురింపబడి పెద్దల మన్నలను పొందింది. ఆ తరువాత ప్రతిసంవత్సరం పలు సంప్రదాయ గ్రంథాలు ప్రకాశింపజేయబడ్డాయి. ఈ ఏడు శ్రీపరాశరభట్టర్ ప్రణీతమైన శ్రీరంగనాథస్తోత్రం సవ్యాఖ్యానంగా ముద్రింపబడుతున్నది. ఈ వ్యాఖ్య సుమారు ఏడేండ్లక్రితం చీరాల వాస్తవ్యులు, మాన్యమిత్రం, శ్రీరావి మోహనరావుగారి ఆర్థిక సహాయంతో సాధనగ్రంథమండలి, తెనాలివారిద్వారా ప్రకాశింప చేయబడినా దీని ప్రతులు ఇపుడు దుర్లభం కనుక, పునర్ముద్రింపబడుతున్నది. ఇతఃపూర్వంవలె ఇపుడుకూడా ఈ వ్యాఖ్య అందరి మన్నలను పొందగలదని ఆశిస్తున్నాను. స్వస్తి.

ఇతి నివేదయితా

**ఈ. ఏ. శింగరాచార్యదాసః**



# శ్రీరంగనాథస్తోత్రమ్

శ్రీ పరాశరభట్టార్యః శ్రీ రంగేశపురోహితః ।
శ్రీ వత్సాంకసుత శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥

సప్తప్రాకారమధ్యే సరసిజముకులోద్భాసమానే విమానే
కావేరీ మధ్యదేశే మృదుతరఫణిరాడ్భోగపర్యంకభాగే।
నిద్రాముద్రాభిరామం కటినికటశిరః పార్శ్వ విన్యస్తహస్తం
పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగరాజం భజేఽహమ్॥ 1

కస్తూరీకలితోర్ధ్వపుండ్రతిలకం కర్ణాంతలోలేక్షణం
ముగ్ధస్మేరమనోహరాధరతలం ముక్తాకిరీటోజ్జ్వలమ్।
పశ్యన్మానసపశ్యతోహరరుచః పర్యాయపంకేరుహం
శ్రీరంగాధిపతేః కదా ను వదనం సేవేయ భూయోఽప్యహమ్॥ 2

కదాఽహం కావేరీతటపరిసరే రంగనగరే
శయానం భోగీంద్రే శతమఖమణిశ్యామలరుచిమ్ ।
ఉపాసీనః క్రోశన్ మధుమథన! నారాయణ! హరే!
మురారే గోవిందేత్యనిశ మపనేష్యామి దివసాన్ ॥ 3

కదాఽహం కావేరీవిమలసలిలే వీతకలుషోః
భవేయం తత్తీరే శ్రమముషి వసేయం ఘనవనే ।
కదా వా తం పుణ్యే మహతి పులినే మంగళగుణం
భజేయం రంగేశం కమలనయనం శేషశయనమ్ ॥ 4

పూగీకంఠద్వయసరస స్నిగ్ధనీరోపకంఠామ్
ఆవిర్మోదస్తిమితశకునానూదితబ్రహ్మఘోషామ్ ।
మార్గే మార్గే పథికనివహై రుంచ్యమానాపవర్గాం
పశ్యేయం తాం పునరపి పురీం శ్రీమతీం రంగధామ్నః ॥ 5

న జాతు పీతామృతమూర్ఛితానాం నాకౌకసాం నందనవాటికాసు ।
రంగేశ్వర! త్వత్పదమాశ్రితానాం రథ్యా శునా మన్యతమో భవేయమ్ ॥ 6

అసన్నికృష్టస్య నికృష్టజంతోః మిథ్యాపవాదేన కరోషి శాంతిమ్ ।
తతో నికృష్టే మయి సన్నికృష్టే కాం నిష్కృతిం రంగపతే కరోషి ॥ 7

శ్రీరంగం కరిశైల మంజనగిరిం తార్క్ష్యాద్రి సింహాచలౌ
శ్రీకూర్మం పురుషోత్తమంచ బదరీనారాయణం నైమిశమ్ ।
శ్రీమద్ద్వారవతీప్రయాగ మధురాఽయోధ్యా గయా పుష్కరం
సాలగ్రామఖనిం నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః ॥ 8





శ్రీపరాశరభట్టర్ ప్రణీతమైన

# శ్రీరంగనాథస్తోత్రము - సవ్యాఖ్యానము

## ఉపోద్ఘాతము

**శ్రీ పరాశరభట్టార్యః శ్రీ రంగేశపురోహితః ।**
**శ్రీ వత్సాంకసుత శ్శ్రీమాన్ శ్రేయసే మే ఽస్తు భూయసే ॥**

అనితరసాధారణమైనప్రతిభాపాండిత్యములకు మాఱుపేరును, కూరేశుల కుమారులును అగు పరాశర భట్టారకులను ఆచార్యులచే ఈ స్తోత్రము రచింపబడినది. ఒకానొక సమయమున చోళరాజుతో కల్గిన భేదాభిప్రాయమువలన భట్టరు కొంతకాలము గోష్ఠీపురమను విష్ణుక్షేత్రమున నివసించిరి. ఆ వృత్తాంతము తిరువాయ్ మొழி ప్రబంధములోని **"మున్నీర్ఞాలమ్"** అనే దశకంయొక్క ఈడు వ్యాఖ్యాన ప్రవేశం ఆరంభంలో తెలుపబడినది. ఆ వృత్తాంతము క్లుప్తముగా ఇట్లున్నది.

భట్టరు శ్రీరంగమున వినిష్టాద్వైత సిద్ధాంత నిర్వాహక సార్వభౌములై, భగవద్రామానుజుల స్థానమును అలంకరించి, సంప్రదాయ రక్షణమును చేయు సమయమున, ఆ క్షేత్రములోని ఏడు ప్రాకారములలో ఆఱవ ప్రాకారమగు త్రివిక్రమవీథి ప్రాకారము మిక్కిలి జీర్ణమయ్యెను. దానిని పునఃరుద్ధరింపదలచిన అచటి ప్రభువు వీరసుందర బ్రహ్మరాయుడు, ఆ ప్రాకారమును నేరుగా కట్టుటకు ప్రయత్నించినపుడు కూరేశుల ప్రియశిష్యులైన ఒక మహనీయుల (వీరికి పిళ్ళై పిళ్లై ఆழ்వాన్ అని పేరు) గృహము అడ్డు వచ్చుటచే దానిని పడగొట్టి ప్రాకారమును నిర్మింపదలచెను. ఆ విషయమును తెలిసి కొనిన భట్టరు ఆ ప్రభువుతో, "నీవు కట్టు ప్రాకారములు భగవానునకు రక్షకములని తలచుచుంటివా! పరమభాగవతులగు ఆమహనీయుల మంగళాశాసనమే కదా భగవానునకు రక్షకము. పూర్వము తిరుమంగై ఆழ்వార్లు నాల్గవ ప్రాకారమును కట్టునపుడు భక్తాంఘ్రిరేణులను ఆழ்వార్లు భగవానునకు పూమాలెను కూర్చుచోటు అయిన ఉద్యానవన ప్రదేశము అడ్డు రాగా, దానిని తొలగించి ప్రాకారమును నేరుగా కట్టుట మాని, ఆ చోటును వదలి ప్రాకారమును కొంచెము ప్రక్కకు కట్టిన సందర్భమును మఱచితివా? అట్లే ఇపుడును ఈ భాగవతుల గృహమును వదలిపెట్టి, ప్రాకారమును కొంచెము ప్రక్కగా కట్టుము'' అని పల్కిరి. ఆ రాజు "తన ఆచార్యుల పుత్రులగు భట్టరు ఆదేశించిరికదా'' అని కాని, "ఒక మహనీయులు మంచిని పల్కిరి కదా'' అని కాని తలపక, ఆ మాటలను పెడచెవిని బెట్టి, పిళ్లై పిళ్లై ఆழ்వాన్ ఇంటిని

కూలగొట్టి ప్రాకారమును కట్టుటకు ప్రారంభించెను. ఆ కారణముగా భట్టరునకు, ఆ ప్రభువునకు మధ్య కల్గిన అభిప్రాయభేదములు క్రమముగా వృద్ధి అయ్యెను. భట్టరుపై కక్షను పెంచుకొనిన వీరసుందరబ్రహ్మరాయుడు ఆ ఆచార్యులను శ్రీరంగ మున నివసింపకుండచేయవలయునను ప్రయత్నములను ప్రారంభించెను. అపుడు భట్టరు ఎవరికిని తెలుపక శ్రీరంగమును వీడి గోష్ఠీపురమను క్షేత్రమును చేరిరి. అట్లు శ్రీరంగమునకు, శ్రీరంగనాథునకును దూరముగా ఉండవలసివచ్చినదే అను ఆర్తి వలన "ఎపుడు మరల శ్రీరంగమును దర్శింతును? శ్రీరంగనాథుని సేవింతును?'' అనెడి భావోద్వేగము ఆ ఆచార్యులకు కల్గెను. కులశేఖరసూరి తమ ప్రబంధమున, **"తిరువరఙ్గ ప్పెరునకరుళ్ తెణ్ణీర్పొన్ని తిరైక్కైయాల్ అడివరుడ ప్పళ్ళికొళ్ళుమ్ కరుమణియై క్కోమళత్తై క్కణ్డుకొణ్డు ఎన్ కణ్ణిణైగళ్ ఎన్నుకొలో కళిక్కునాళే"** "శ్రీరంగ దివ్యనగరమున కావేరీనది తన కెరటములనెడి కరములతో సేవించుచుండగా శయనించియున్న నీలమణిసదృశుడు, మిక్కిలి సౌకుమార్యమును కలవాడగు శ్రీరంగ నాథుని కన్నులారా సేవించి, నా కన్నులేనాడో కదా సంతోషించునది!'' అని, **"కళి మలర్శేర్ పొழிల் అరఙ్గత్తు ఉరకమేతిక్కణ్ వళరుమ్ కడల్ వణ్ణర్ కమలకణ్ణుమ్ ఒళిమదిశేర్ తిరుము కముమ్ కణ్డు కొణ్డు ఎన్నుళ్ళమిక వెన్దుకొలో వురుకునాళే"** "తేనేను స్రవించు పూలను కల్గిన తోటలతో చుట్టబడియున్న శ్రీరంగమున ఆది శేషునిపై శయనించియున్న సముద్రవర్ణుడు, కమలనేత్రుడగు స్వామియొక్క ప్రకాశించు చంద్రబింబమువంటి ముఖమును కన్నులార సేవించి నా మనస్సు ఎపుడోకదా ద్రవించునది'' అని, **"మాయోనై క్కణ్డేన్ కణ్గళ్ నీర్మల్క ఎన్దుకొలో నిఱ్కునాళే"** "అత్యాశ్చర్యకరములైన లీలనుచేయు స్వామిని సేవించి నేను నా కన్నులు నీరు నిండగా నిలచునది ఏనాడోకదా'' అనియు పరితపించిన రీతిలో భట్టరును ఈ స్తోత్రమును తమ ఆర్తిని ప్రకటించుచు కొన్ని శ్లోకముల రూపమున ద్వారా ఆశువుగా రచించిరి. అవి శ్రీరంగనాథస్తోత్ర రూపమును పొందినవి. కులశేఖరసూరి భావమును అనుసరించు ఈ శ్లోకములు ఆ మహనీయుల సూక్తులకు సైతము మెఱుగుపెట్టినవని చెప్పనగును. ఈ శ్లోకములలోని భావములు, విశేషములును యథామతి తెలుపబడు చున్నవి. ప్రస్తుతవ్యాఖ్య మహావిద్వాంసులు, ప్రాతఃస్మరణీయ కీర్తివైభవులును అగు **ప్ర.భ. అణ్ణా స్వామివారి ద్రావిడవ్యాఖ్యానమును** కృతజ్ఞతాపూర్వకముగ అనుసరించి కొన్ని విశేషములు జోడించుచూ వ్రాయబడినది.

---



## శ్రీమతే రామానుజాయ నమః



### శ్రీ పరాశర భట్టర్ ప్రణీతమైన

# శ్రీరంగనాథస్తోత్రము - సవ్యాఖ్యానము

**సప్తప్రాకారమధ్యే సరసిజముకులోద్భాసమానే విమానే**
**కావేరీ మధ్యదేశే మృదుతరఫణిరాడ్భోగ పర్యంకభాగే।**
**నిద్రాముద్రాభిరామం కటినికటశిరః పార్శ్వ విన్యస్తహస్తం**
**పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగరాజం భజేఽహమ్॥ 1**

కావేరీమధ్యదేశే = ఉభయకావేరుల నడుమ ప్రదేశముననున్న శ్రీరంగమున, సప్తప్రాకారమధ్యే = ఏడు ప్రాకారముల మధ్యలో, సరసిజముకుల + ఉద్భాసమానే = తామర మొగ్గవలె గొప్పగా శోభిల్లు, విమానే = ప్రణవాకార శ్రీరంగవిమానమునందు, మృదు తరఫణిరాట్ + భోగపర్యంకభాగే = మిక్కిలి సుకుమారమైన ఆదిశేషుని శరీరమను పరుపుపై, నిద్రాముద్రాభిరామమ్ = నిద్రించు సన్నివేశముతో మనోహరమైన వాడు, కటినికట శిరఃపార్శ్వవిన్యస్తహస్తమ్ = నడుము సమీపమున ఒక చేతిని, తలకు సమీపమును వేరొక చేతిని పెట్టుకొనినవాడు, పద్మాధాత్రీకరాభ్యామ్ = లక్ష్మీదేవియొక్క, భూదేవియొక్క హస్తములతో, పరిచిత చరణమ్ = సేవింపబడు పాదములను కల వాడును, అగు, రంగరాజమ్ = శ్రీ రంగనాథుని, అహమ్ = నేను, భజే = భజించు చున్నాను.

**వ్యాఖ్యానము :-** ఉభయ కావేరీనదీమధ్యదేశమగు ద్వీపమున వెలసియున్న శ్రీరంగక్షేత్రములో సప్తప్రాకారములమధ్య తామర మొగ్గవలె శోభిల్లు విమానమునందు, సుకుమారమైన ఆదిశేషుడనెడి పడుకపై నిద్రించు భంగిమలో మనోహరముగనున్నవాడు, నడుము వద్ద ఒక చేతిని, తల వద్ద వేరొక చేతిని పెట్టుకొనినవాడు, శ్రీదేవి భూదేవులు తమ కరములతో సేవించు పాదములను కలవాడును అగు శ్రీరంగనాథుని నేను సేవింతును.

ఈ శ్లోకమున భట్టరు శ్రీరంగక్షేత్రమున శ్రీరంగనాథుడు వేంచేసియున్న సన్ని వేశమును మన కన్నులముందు రమ్యముగ నిలుపుచున్నారు.

**సప్తప్రాకారమధ్యే** - ప్రణవప్రతిపాద్యుడు భగవానుడు. శ్రీరంగక్షేత్రములోని ఏడు ప్రాకారములు, విమానమును కలిసిన ఎనిమిది అగును. ఈ ఎనిమిదియు అష్టాక్షరీ మంత్రమునకు చిహ్నములని పిళ్లైప్పెరుమాళ్ అయ్యంగార్ అను తమిళకవి అభి వర్ణించిరి. శ్రీరంగమందిరము **"వైకుంఠమ్ రంగమందిరమ్"** అనునట్లు సాక్షాత్తు వైకుంఠమునకు ప్రతీక. వైకుంఠమును చేరవలెనన్న ఏడు లోకములను దాటి పోవలయును. అట్లే, శ్రీరంగమందిరమును చేరవలెనన్నను ఏడు ప్రాకారములను దాటి పోవలయును. ఇట్లు, శ్రీరంగనాథునకు, శ్రీరంగ మందిరమునకును ఏడు అంకెతో అవినాభావసంబంధము కలదు. **"మాడమాళికై శూఴ్ తిరువీదియుమ్, మన్నుశేర్ తిరివిక్కిరమన్ వీదియుమ్, ఆడల్ మాఱనకలఙ్కన్ వీదియుమ్, ఆలినాడనమర్న్దుఱై వీతియుమ్, కూడల్వాఴ్ కులశేకర్ వీతియుమ్, కులవరశ మకేన్దిరన్ వీతియుమ్, తేడు తన్మవన్ మాలవన్ వీతియుమ్ తెన్నరఙ్గర్ తిరువావరణమే"** అనే పాశురము అనుసంధేయము.

**సరసిజముకులోద్భాసమానే** - ఆకారమున, అందమున తామరమొగ్గతో విమానము నకు పోలిక.

**కావేరీమధ్యదేశే** - ఉభయకావేరీమధ్య పుళిన ప్రదేశము సాక్షాత్తు పరమపదము. **"యద్విష్ణోఃపదమపరం పరో రజోఽగ్ర్యం ముక్తానా మనువిరజం విదీప్రమాహుః, తత్పుణ్యం పుళినమిదం తయాఽద్య మధ్యే కావేరి స్ఫురతి"** (విరజానదీ తీరమున తమోగుణము రజోగుణము లేని, విష్ణువుయొక్క ఏ పరమపదము కలదో, ముక్తులకు మాత్రమే విశేషముగా ప్రకాశించునది అని దేనిని పల్కుదురో, పవిత్రమైన ఆ ఇసుకతిన్నె ఇపుడు "ఇది'' అని నిర్దేశించి పల్కునట్లు కావేరీనదీమధ్యమున ప్రకాశించుచున్నది.) (26) అనుచు భట్టరు శ్రీరంగరాజస్తవమున పల్కుట గమనింపతగినది.

**మృదుతరఫణిరాడ్భోగ పర్యంకభాగే** - అత్యంతము మృదువైన ఆదిశేషుని భోగమే పడక. **"రంగభర్తు రపి లోచనచర్చాం సాహసావళిషు లేఖయామానమ్, పుష్పహాస ఇతి నామ దుహానం సౌకుమార్యమ్"** (చూపుల ప్రసారములను సైతము సాహసకృత్యములలో వ్రాయుంచునట్టి, పుష్పహాసమను పేరును కల్గించు శ్రీరంగనాథుని సౌకుమార్య గుణము) అనుచు భట్టరు శ్రీరంగనాథుని సౌకుమార్యము లోకోత్తరమని వర్ణించిరి. అట్టి స్వామి దివ్యదేహమునకును శ్రమ కల్గింపనట్టి మెత్తని దనమును కలిగినది ఆదిశేషుని శరీరము. కావున ఇద్దరిమధ్య తారతమ్యమును తెలుపు ఇచటి **"తరప్"** ప్రత్యయము భగవానుని సౌకుమార్యముకంటె ఆదిశేషుని సౌకు మార్యము అతిశయించియుండుటను తెలుపునని చెప్పనగును.

**నిద్రాముద్రాభిరామమ్** - **"నిద్రాసి జాగర్యయా"** అని శ్రీరంగనాథుని నిద్రా ముద్రను గూర్చి భట్టరు నుడువిరి. **"ఉఱఙ్గువాన్ పోల్ యోగుశెయ్ద పెరుమాన్"** (నిద్రించువాని



వలె కనులు మూసికొని జగద్రక్షణచింతనను చేయు స్వామి) అని నమ్మాఴ్వార్లు, **"ఒరు పామ్బై మెత్తైయాక విరిత్తు అదన్మేల్ కళ్ళనిద్దిరై కొళ్కిన్ఱ"** (ఒక పామును, అనగా - ఆదిశేషుని పరుపుగా పరచుకొని దొంగనిద్రను గ్రహించిన) అని పెరి యాఴ్వార్లు కీర్తించిరి. శ్రీరాముని నిద్రాముద్రలోని అందమును దర్శించిన అదృష్ట శాలి విశ్వామిత్రుడు. ఆ సౌందర్యమునకు అచ్చెరువొంది **"కౌసల్యాసుప్రజారామ"** అని కీర్తించెను. సీతాదేవి **"స మయా బోధితః శ్రీమాన్"** (అద్భుత శయన సౌందర్యము కల ఆ శ్రీరాముడు నాచే నిద్రలేపబడినాడు) అనుచు నిద్రా సన్నివేశమునకు మంగళము పాడెను. శ్రీరామచంద్రునకు ప్రతిరూపమగు శ్రీరంగనాథుని నిద్రా ముద్రను భట్టరు ఇచట కీర్తించుచున్నారు. భట్టరు శ్రీరామభక్తాగ్రేసరులగుట ఇచట స్మరణీయము.

**కటినికటశిరఃపార్శ్వ విన్యస్తహస్తమ్** - ఆదిశేషునిపై పరుండియున్న శ్రీరంగ నాథుడు తన రెండు చేతులలో ఒక చేతిని నడుముపై, వేఱొక చేతిని తలవద్ద పెట్టు కొని యున్నాడు. ఈ సన్నివేశము ఇచట ప్రస్తుతము. భట్టరు దీనిని శ్రీరంగరాజస్తవమున కీర్తించుచు, **"కిరీటం రంగేశయితు రుపధానీకృతభుజో విధీశాధీశత్వాత్ ఘటత ఇతి సంస్పృశ్య వదితి, నిహీనానాం ముఖ్యం శరణ మితి బాహుస్తదితరః స్ఫుటం బ్రూతే పాదాంబుజయుగళ మాజానునిహితః"** (శ్రీరంగనాథుడు బ్రహ్మరుద్రాదులకు అధిపతి కావున ఇతనికి కిరీటం తగినది అని ఒక హస్తము ఆ కిరీటమును స్పృశించి పల్కు చున్నది. మోకాళ్ళవరకు చాచబడిన ఇంకొక హస్తము అధములకు శ్రీస్వామి చరణాంబుజ యుగళమే రక్షకమని స్పష్టము చేయుచున్నది.) (110) అని పల్కిరి. కిరీటమును సూచించు చేయి, ఆ కిరీటమును తాను ధరించుట బ్రహ్మేశ్వరులకు సైతము ప్రభువగుటచే తగునని తెలుపుచున్నదని, మోకాలివరకు చాచుకొనియున్న ఇంకొకచేయి తన పాదములే భక్తజనరక్షకములని తెలుపు చున్నదను ఈ శ్లోకములోని భావము ప్రస్తుతమునను అనుసంధేయము. కిరీటమును తాకు కుడిచేయి పరత్వమును, పాదములను చూపు ఎడమచేయి సౌలభ్యమును తెలుపుచున్నవని సారాంశము. దీనివలన శరణ్యత్వ పూర్తిసిద్ధము.

**పద్మాధాత్రీకరాభ్యాం పరిచిత చరణమ్** - **"వడివిణైయిల్లా మలర్ మకళ్ మఱ్ఱై నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడియై"** (నిరుపమాన సౌందర్యము కల లక్ష్మీదేవి, మిగిలిన భూదేవియు మెల్లగా స్పృశించు చరణములను మహాపాపినగు నేను స్పృశించునట్లు నీవు పిలుచుటయో, లేక నా వద్దకు వచ్చుటయో చేయకపోతివికదా!) అను నమ్మాఴ్వార్ల (9-2-10) సూక్తి ఇచట స్మరణీయము. పరిచితశబ్దప్రయోగము వలన స్వామి పాదముల మార్దవము సూచితము. **"లక్ష్మీమహీతదనురూపనిజానుభావ నీళాదిదివ్యమహిషీకరపల్ల వాభ్యామ్, సంవాహనేఽపి సపది క్లమమాదధానౌ........ పాదౌ"** అను శ్రీ వేంకటేశప్రపత్తి లోని సూక్తియు అనుసంధేయము. స్వామిని స్తుతించు ఈ శ్లోకము స్రగ్ధరావృత్తమున కూర్చబడుట విశేషము. శ్లోకమాలికయేకదా ఈ స్తుతి.

**కస్తూరీకలితోర్ధ్వపుండ్రతిలకం కర్ణాంతలోలేక్షణం**
**ముగ్ధస్మేరమనోహరాధరతలం ముక్తాకిరీటోజ్జ్వలమ్।**
**పశ్యన్మానస పశ్యతోహరరుచః పర్యాయ పంకేరుహం**
**శ్రీరంగాధిపతేః కదా ను వదనం సేవేయ భూయో ఽప్యహమ్॥ 2**

పశ్యన్మానసపశ్యతోహరరుచః = దర్శించు మనస్సును చూచుచుండగనే హరించు అందమును కల్గినదగు, శ్రీరంగ + అధిపతేః = శ్రీరంగనాథునియొక్క, కస్తూరీకలిత+ ఊర్ధ్వపుండ్రతిలకమ్ = కస్తూరితో దిద్దబడిన ఊర్ధ్వపుండ్రతిలకమును కల్గినది, కర్ణ + అంతలోల + ఈక్షణమ్ = కర్ణముల చివరవరకు (చెవుల వరకు) విస్తరించి అటు ఇటు కదలాడు కన్నులను కల్గినది, ముగ్ధస్మేర మనోహర + అధరతలమ్ = వ్యామోహమే రూపు దిద్దుకొనిన చిఱునవ్వును కల్గిన, మనస్సును దోచుకొనునట్టి అధరమును (క్రింది పెదవి) కల్గినది. ముక్తాకిరీట + ఉజ్జ్వలమ్ = ముత్యములు, పొదిగిన కిరీటముతో ఉజ్జ్వలముగానున్నది, పర్యాయపంకేరుహమ్ = వేఱొక తామరవలె నున్నది అగు, వదనమ్ = ముఖమును, అహమ్=నేను, భూయః = తిరిగి, కదా ను = ఎప్పుడో కదా, సేవేయ=సేవింపగలను!

సేవించువారి మనస్సును ప్రత్యక్షముగనే దోచుకొను అందము కల్గినది, కస్తూరిచే దిద్దబడిన ఊర్ధ్వపుండ్రతిలకమును కల్గినది, ఆ కర్ణము విస్తరించిన చంచలములైన నేత్రములను కల్గినది, వ్యామోహము మూర్తీభవించినదగు చిఱునవ్వుతో మనస్సును ఆకర్షించు అధరమును కల్గినది, ముత్యాలతో కూడిన కిరీటముతో మిక్కిలిగా ప్రకాశించునది, తామరపూవువలెనున్నదగు శ్రీరంగనాథుని ముఖమును మఱల నేను ఎపుడు దర్శింపగలనోకదా!

ఈ శ్లోకమునుండి నాల్గు శ్లోకములలో భట్టరు శ్రీరంగక్షేత్రమును, శ్రీరంగనాథుని ఎడబాయుటచే తమకు కల్గిన ఆర్తిని ప్రకటించుచున్నారు. "అయ్యో! నాతాపము ఏనాడు తీరును? అట్టి సమయమును నా జీవితమున నేను చూడగలనా?'' అని పరితపించుట ఇందలి విషయము.

"మధువును కల్గిన పూవులతోకూడిన తోటలచే పరివేష్ఠింపబడిన శ్రీరంగ క్షేత్రమున ఆదిశేషునిపై పవళించియున్న సముద్రవర్ణుని, అతని కమలనేత్రములను, చంద్రునివలె శోభిల్లు ముఖమును సేవించి నా మనస్సు ఇక ఏనాడు ద్రవించునోకదా!'' అను కులశేఖరుల సూక్తికి ఈ శ్లోకము అనువాదప్రాయము.

**కస్తూరీకలితోర్ధ్వపుండ్రతిలకమ్** - కస్తూరీ తిలకముతో దిద్దబడిన శ్రీరంగనాథుని ఊర్ధ్వపుండ్రతిలకమును భట్టరు **"హృదయం ప్రసాదయతి రంగపతేః మధురోర్ధ్వ పుండ్రతిలకం లలితమ్, అళికార్ధచంద్రదళసంవలితా మమృతస్రుతం యదభిశంకయతే"** (శ్రీరంగనాథుని అందమైన ఊర్ధ్వపుండ్ర తిలకము లలాటమనెడి అర్ధచంద్రము నుండి జాలువారిన అమృతప్రవాహమువలె హృదయమును ప్రసన్నము చేయుచున్నది.) అనుచు ముఖమను చంద్రునినుండి స్రవించు అమృతప్రవాహముగా ఉత్ప్రేక్షించిరి. ఊర్ధ్వపుండ్రతిలకము ఆత్మలను ఊర్ధ్వగమనము పొందునట్లు స్వామి చేయుటను సూచించుననుచు శ్రీశంకరులు పాదాదికేశాంతస్తుతిలోని **"ఊర్ధ్వం తత్పుంద్ర మూర్ధ్వం జనిమరణతమఃఖండనం మండనం నః"** (మన పుట్టుక చావులనెడి తమస్సును ఖండించునట్టి ఆ ఊర్ధ్వపుండ్రము గొప్ప అలంకారము) అను సూక్తిద్వారా సూచించిరి. కూరేశులును వరదరాజస్తవమున, **"ఉద్ధరత్యుపరిభక్తజనానితి ఊర్ధ్వతాశ్రయణ సూచితశక్తిమ్, ఊర్ధ్వపుండ్రతిలకం బహుమానాత్ కిము బిభర్షి"** (ఊర్ధ్వముఖముగా నుండుటద్వారా భక్తులను ఊర్ధ్వగతిలో ఉద్ధరింతును అనెడి శక్తిని సూచించు ఊర్ధ్వపుండ్రమును బహుమానపూర్వముగా ధరించుచున్నావా ఏమి) అనుచు స్వామి భక్తులను ఉద్ధరించుటను ఊర్ధ్వపుండ్రము తెలుపుననిరి.

**కర్ణాంతలోలేక్షణమ్** - చెవుల పర్యంతము వ్యాపించియున్న నేత్రశోభ ఈ విశేషణమున ప్రస్తుతము. కర్ణముల వరకు విస్తరించుట ఒక విశేషముకాగా, ఎల్లప్పుడు చలించుట వేఱొక విశేషము. మొదటి అంశమును భట్టరు రమణీయముగ, **"కృపయా పరయా కరిష్యమాణే సకలాంగం కిల సర్వతోఽక్షినేత్రే, ప్రథమం శ్రవసీ సమాస్తృణీతే ఇతి దైర్ఘ్యేణ విదంతి రంగనేతుః"** (గొప్ప దయతో శరీరమంతటినీ నేత్రములను కల్గిన దానినిగా చేయబోవుచూ, మొదటచగా చెవులను ఆక్రమించుచున్నవని స్వామి నేత్రముల దైర్ఘ్యమువలన విజ్ఞులు తెలిసికొనుచున్నారు.) (98) అని స్తుతించిరి. అన్ని అంగములను ఆవరింపదలచిన స్వామి కన్నులు మొదట తమకు సమీపములో నున్న కర్ణముల వరకు వ్యాపించుచున్నవను ఈ సూక్తి భావము ఇచటను అనుసంధేయము. అట్లే ఎల్లప్పుడు కదలాడు స్వభావమును స్వామి నేత్రములు కల్గియుండుటను భట్టరు **"శ్రవోనాసారోధాత్ తదవధికడోలాయితగతే విశాలస్ఫీతాయద్రుచిర శిశిరాతామ్ర ధవళే, మిథో బద్ధస్పర్ధస్ఫురితశఫరద్వంద్వలలితే, క్రియాస్తాం శ్రీరంగప్రణయినయనాబ్జే మయి దయామ్"** (ఇటు నాసికచేత, అటు చెవులచేత అడ్డగింపబడినందువలన అంతవరకు దొర్లుచున్న గమనమును కలిగినవి, విశాలమై, గొప్పవై, పొడవుగానున్నవై, సుందరమై, చల్లనివై కొంచెము ఎఱ్ఱనివై, మిగిలిన భాగమున తెల్లనివై, పరస్పరము పోటీపడు రెండు అందమైన చేపలవలె అందముగానున్న శ్రీరంగనాథుని నేత్రపద్మములు నాపై దయచూపుగాక!) (99) అను సూక్తితో అభివర్ణించిరి. అంగములందు అంతటి వ్యాపింపదలచిన నేత్రములకు అటు కర్ణములు, ఇటు నాసికము అడ్డు తగులుట, పరస్పరము స్పర్ధించుటయు స్వామి నేత్రములు చాంచల్యమునకు హేతువులు అను ఈ శ్లోకములోని రమ్యమైన భావమును ఇచట స్మరింపనగును.

**ముగ్ధస్మేరమనోహరాధరతలమ్** -శ్రీరంగనాథుని చిఱునవ్వు శోభను భట్టరు వర్ణించిన ఈ సూక్తి ఇచట అనుసంధేయము. **"అమృతతటాకచంద్రాంబుజస్మయహరశుచి ముగ్ధమందస్మితమ్"** (అమృత తటాకము యొక్క, చంద్రుని యొక్క పద్మముయొక్క గర్వమును హరించు, స్వచ్ఛమైన, మనోహరమైన చిరునవ్వు) (93) అనుచు స్వామి చిఱునవ్వు అమృతసరస్సు యొక్క, చంద్రుని యొక్క, పద్మముల యొక్క గర్వమును హరించునది - అని పల్కిరి. స్వామి చిఱునవ్వు ముగ్ధమనుట మిక్కిలి అర్థవంతము. ముగ్ధమనగా మోహమును కల్గినది. ఈ వ్యామోహము భక్తులపై గల వ్యామోహమే! ఈ చిఱునవ్వుద్వారా స్వామి భక్తులతో భాషించునట. **"సంభాషమాణమివ సర్వవశంవదేన"** (69) అని భట్టరు పల్కిరి కదా! ఈ చిఱునవ్వు, స్వామి తన ఆయుధముల ద్వారా భక్తరక్షణనుచేయునని, స్వామిపాదద్వంద్వము భయములన్నిటిని తీర్చి, ఇష్టప్రాప్తిని కల్గించునని వ్యాఖ్యానించుచున్నదా! ఏమి! అను భావమున భట్టరు **"స్మేరేణ వక్త్రేణ తత్ వ్యాకుర్వన్నివ"** (70) అని శ్రీరంగరాజస్తవములో పల్కుట ప్రకృతమున స్మరణీయము. ఇట్టి చిఱునవ్వుతోనే స్వామి చూపరుల మనస్సును దోచుకొనుచున్నాడు. **"రామః కమల పత్రాక్షః సర్వసత్త్వమనోహరః"** అనుచు వాల్మీకి శ్రీరాముడు తన కమల నేత్రములతో అందఱి చిత్తములను ఆకట్టుకొనెనని పల్కెను. ఇచట భట్టరు శ్రీరంగనాథుడు తన చిఱునవ్వుతో అందఱిని వశపఱచుకొనుచున్నాడనిరి. **"స్మితపూర్వభాషీ చ పూర్వభాషీ చ రాఘవః"** కదా! శ్రీరామునకు, శ్రీరంగనాథునకు మధ్య తాదాత్మ్యమును పూర్వాచార్యులు రమణీయముగా అనుసంధించిరి కదా!

**ముక్తాకిరీటోజ్జ్వలమ్** - స్వామి కిరీటము ముఖమును ఉజ్జ్వలముగా చేయుచున్నదని ఇచటి భావము. భట్టరు శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుని కిరీటమును వర్ణించుచు, **"కిరీటచూడరత్నరాజిరాధిరాజ్యజల్పికా, ముఖేందుకాంతి రున్ముఖం తరంగితేవ రంగిణః"** (సామ్రాజ్యము సూచించు కిరీటములోని, కిరీటము కిందగల చూడమనెడి పట్టభూషణములోని రత్నసమూహము యొక్క కాంతి ఉన్ముఖముగా ప్రసరించినట్లు శ్రీరంగనాథుని ముఖచంద్రకాంతి గోచరించుచున్నది.) అనుచు స్వామి ముఖకాంతి పైకి ప్రసరించినట్లున్నదని పల్కిరి. ఇచట కిరీటకాంతిచే ముఖము శోభిల్లుచున్నదనిరి. ఈ రెండిటికిని మూలము శఠకోపసూరి భావనావిశేషమే అనదగును. శఠకోపులు తమ ప్రబంధమున భగవానుని స్తుతించుచు, **"ముడిచ్చోదియాయ్ ఉనతు ముకచ్చోది మలర్న్దతువో?"** "స్వామీ! నీ ముఖశోభ నీ కిరీటశోభగా వికసించెనా?" అని ఉత్ప్రేక్షించిరి. ఉత్కటకోటికమైన సంశయము ఉత్ప్రేక్ష కావున, సంశయము కోటిద్వయాత్మకము కావున, ఇచట రెండవ భావన ఏమనగా, "స్వామీ! నీ కిరీటశోభయే ముఖకాంతిగా వికసించెనా?" అనునది. అదియే ప్రస్తుతమున కవిచే ప్రస్తుతము అనదగును.



**పశ్యన్మానసపశ్యతోహరరుచః** - పశ్యతోహరుడనగా చూచుచుండగానే హరించువాడని భావము. స్వామి ముఖశోభ భక్తుల మనస్సులను దోచు పశ్యతోహరము. ఇట్టి గుణము స్వామి అంగము లన్నిటికిని ఉన్నను ముఖశోభ అన్ని అంగముల శోభకంటె అతిశయించియుండుటచే అది ఇచట కీర్తింపబడినది.

**పర్యాయపంకేరుహమ్** - స్వామి ముఖము వేఱొక తామరపూవు అనుటచే సాదృశ్యము పూర్ణమని భావము. **"ముఖపుండరీకము"** ఇత్యాది సూక్తులు ఇచట స్మరణీయములు.

**"పశ్యన్మానసపశ్యతోహరరుచిమ్"** అను పాఠాంతరము నపుంసకలింగ విశేష్యమగు ముఖమునకు అన్వయింపదు కావున గ్రహింపతగినది కాదు. అనుస్వారములేక **"రుచి"** అని ఉన్నచో అన్వయించును. అపుడు ఛందస్సుకు భంగము కల్గును. కావున ప్రకృత పాఠమే సరిఅయినది.

శ్రీరంగనాథుని ముఖశోభ ప్రస్తుతింపబడిన ఈ సందర్భమున నాచ్చియార్ తిరుమొழி మను ద్రావిడ ప్రబంధములోని (10-5) సూక్తిని వ్యాఖ్యానించుచు శ్రీకృష్ణసూరి ఉట్టంకించిన రెండు వృత్తాంతములు తప్పక స్మరింపతగినవి. భట్టరు తమ చివరిదశలో నడుముపై పుండు ఏర్పడి బాధపడు సమయమున శ్రీరంగనాథుడు అర్చకముఖమున ఆ ఆచార్యులను పిలచి, "ఓయీ! భయపడుచుంటివా ఏమి?" అని ప్రశ్నింపగా, భట్టరు, "స్వామి! నాకు నీవు అనుగ్రహింపని వైభవము ఏమియును లేదు. ఇచటనే ఉన్నను పరమపదమును నేను చీటి వ్రాసి ఇచ్చిన చెల్లునట్లుగా అధీనము చేసితివి. ఈ విషయమున ఏ కొఱతయు లేదు. కాని పరమపదమునకు పోయినచో అచట ఈ చల్లని ముఖమును, ఈ తిరునామమును, చిఱునవ్వును దర్శింపలేను కదా! అని భయమగుచున్నది." అని సమాధానమును పల్కిరి.

శ్రీయామునుల కుమారులగు శొట్టైనంబి అను ఆచార్యులు అంతిమసమయమున కొందఱు మీరు ఇపుడు తలచునది ఏమని ప్రశ్నింపగా, "యామునుల సంబంధము వలన నాకు పరమపదప్రాప్తి కలుగుటలో సందేహము లేదు. కాని, అచట పరమపదనాథుని ముఖము శ్రీరంగనాథుని ముఖమువలె చల్లగానుండకపోయినచో, అండభిత్తిని చీల్చుకొని శ్రీరంగమును తిరిగి చేరవలయునని తలచుచుంటిని" అని పల్కిరి. పై ఉదంతములు రెండును శ్రీరంగనాథుని ముఖశోభ, మందస్మిత శోభయు భక్తులకు ఎంత ఆకర్షకములో తెలుపుచున్నవికదా! ఈ శ్లోకము శార్దూలవిక్రీడితవృత్తమున నిబద్ధము.

**కదాఽహం కావేరీతటపరిసరే రంగనగరే**
**శయానం భోగీంద్రే శతమఖమణిశ్యామలరుచిమ్ ।**
**ఉపాసీనః క్రోశన్ మధుమథన! నారాయణ! హరే**
**మురారే! గోవిందేత్యనిశ మపనేష్యామి దివసాన్ ॥** 3

కావేరీతటపరిసరే = కావేరీనదీతీర సమీపమున, రంగనగరే = శ్రీరంగమున, భోగి + ఇంద్రే = ఆదిశేషుని పై, శయానమ్ = పరుండియున్నవాడు, శతమఖమణి శ్యామలరుచిమ్ = ఇంద్రనీలమణివంటి పచ్చని రంగును కలవాడును అగు స్వామిని, ఉపాసీనః = ఉపాసించువాడనై, మధుమథన = మధుసూదనా!, నారాయణ = నారాయణా!, హరే = హరీ, మురారే = మురారీ!, గోవింద = గోవిందా!, ఇతి = అని, అనిశమ్ = ఎల్లప్పుడు, క్రోశన్ = పలవరించుచు, అహమ్ = నేను, కదా = ఎపుడు, దివసాన్ = దినములను, అపనేష్యామి = గడుపగలను?

కావేరీతీర సమీపముననున్న రంగనగరములో ఆదిశేషునిపై పవళించియున్నవాడు, ఇంద్రనీలమువంటివాడును శ్రీరంగనాథుని భక్తితో ఆరాధించుచు, "మధుసూదనా! నారాయణా! హరీ! మురారీ! గోవిందా!'' అనుచు ఆ స్వామి గుణములను తెలుపు నామములను పలవరించుచు దినములను గడుపు సమయము నాకు ఎపుడు వచ్చునో కదా!

ఈ శ్లోకమున **"కావేరీతటపరిసరే"** అను ప్రయోగమును **"రంగనగరే"** అను పదముతో చేర్చి అన్వయించుటకంటే, **'కావేరీతటపరిసరే క్రోశన్'** అని అన్వయించుట మిక్కిలి స్వరసము. పూర్వాన్వయమున శ్రీరంగము కావేరీనదీతీరముననున్నదని శ్రీరంగనాథుడు **"తెణ్ణీర్ పొన్ని తిరైక్కైయాల్ అడివరుడ ప్పళ్ళికొళ్ళుమ్"** "తేటనైన నీటిని కల కావేరి తన కెరటములను చేతులతో సేవింపగా పరుండియున్నాడనియు అర్థము వచ్చును. రెండవ అన్వయమున తాము (కవి) కావేరీ నదీతీరముననుండి "మధుసూదన! నారాయణ!'' అను మొదలగు నామములను అనుసంధించుచు కాల క్షేపమును చేయుటకు కుతూహలపడుట తెలుపబడినది. ఈ శ్లోకమును చూచిన శివభక్తులు ఒకరు, **"కదా వారాణస్యామమరతటినీరోధసి వసన్ వసానః కౌపీనం శిరసి నిదధానోఽఞ్జలిపుటమ్, అయే! గౌరీనాథ! తిపురహర! శంభో! త్రినయన! సితేతి క్రోశన్ నిమిషమివ నేష్యామి దివసాన్"** అను శ్లోకమును రచించిరి.

**శతమఖమణిశ్యామలరుచిమ్** - భట్టరు శ్రీరంగనాథుని **"ఫణిశయమరతకమణి కిరణగణః"** (ఆదిశేషునిపై శయనించిన మరతకమణియొక్క కిరణ సమూహము) అని కీర్తించుట స్మరణీయము. కవులు నీలవర్ణమును పచ్చని రంగును, నలుపును అభేదముగా వర్ణించుట పరిపాటి. కావున ఇచట నీలవర్ణహరితవర్ణములు అభేదముతో వర్ణింపబడినవి. వృత్తము శిఖరిణి.

**కదాఽహం కావేరీవిమలసలిలే వీతకలుషో**
**భవేయం తత్తీరే శ్రమముషి వసేయం ఘనవనే।**
**కదా వా తం పుణ్యే మహతి పులినే మంగళగుణం**
**భజేయం రంగేశం కమలనయనం శేషశయనమ్॥** 4



కావేరీ విమలసలిలే = కావేరీనదియొక్క నిర్మలమైన నీటిలో, (అవగాహ్య = స్నానమొనర్చి), వీతకలుషః = పోయిన పాపములను కలవాడనై, అహమ్ = నేను, కదా = ఎపుడు, భవేయం = కాగలను?, తత్తీరే = ఆ కావేరీ తీరమున, శ్రమముషి = శ్రమను పోగొట్టునట్టి, ఘనవనే = గొప్పవనమునందు, వసేయమ్ = నివసింతును?, పుణ్యే = పవిత్రమైన, మహతి = గొప్పదైన, పులినే = ఇసుకతిన్నెయందు, (శ్రీరంగక్షేత్రమునందు), శేషశయనమ్ = ఆదిశేషుని పడుకగా కల్గిన, కమలనయనమ్ = కమలములవంటి నేత్రములను కల్గిన, మంగళగుణమ్ = కల్యాణగుణములను కల్గిన, తమ్ = ఆ, రంగ+ఈశమ్ = శ్రీరంగనాథుని, కదా వా=ఎపుడో కదా, భజేయమ్ = సేవింతును?

కావేరీనదియొక్క స్వచ్ఛమైన నీటిలో స్నానమొనర్చి, పోగొట్టుకొనిన పాపములను కలవాడను నేనెపుడు కాగలను? ఆ నదీతీరముననున్న, శ్రమహరమైనదగు గొప్పవనమునందు ఎపుడు నివసింపగలను? పవిత్రమైనది, గొప్పదైనది అగు శ్రీరంగ క్షేత్రమున కమలాక్షుడు, కల్యాణగుణుడును అగు శ్రీరంగనాథుని నేనెపుడు సేవింతునో కదా!

మొదటి పాదమున **'అవగాహ్య'** (స్నానముచేసి) అను పదము అధ్యాహారము చేసికొనతగును.

**కావేరీవిమలసలిలే** - కావేరీ నదీ జలములను గూర్చి దివ్యసూరులు రెండు విధములుగా వచించుట ఇచట స్మరణీయము. కులశేఖరులు, **"తెణ్ణీర్పొన్ని"** "స్వచ్ఛమైన నీటిని కల కావేరీనది'' అనుచు తమ ప్రబంధమున (1-) పలుకగా, భక్తాంఘ్రిరేణులు తిరుమాలై అను ప్రబంధమున **"తెళివిలా క్కలఙ్గల్ నీర్శూழ்'** "తేటపడని, కలగియున్న నీటిచే వ్యాప్తమైన కావేరి'' అని తెలిపిరి. **"రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనో యథా"** (సత్పురుషుని మనస్సు వలే రమణీయమైన, ప్రసన్నమైన నీటిని కల్గినది) అను వాల్మీకి సూక్తి చొప్పున నదీజలములను స్వచ్ఛముగా నున్నట్లు వర్ణింపవలసి యుండగా కలుషితములైనట్లు వర్ణించుట ఎట్లు తగును? అను శంకకు పరిహారముగా భట్టరు శ్రీరంగరాజస్తవమున, **"దుగ్ధాబ్ధిర్జనకో జనన్యహమియం శ్రీరేవ పుత్రీవరః శ్రీరంగేశ్వర ఏతదర్హమిహ కిం కుర్యామితీవాకులా, చంచచ్చామర చంద్ర చందన మహామాణిక్యముక్తోత్కరాన్ కావేరీ లహరీకరైర్విదధతీ పర్యేతి"** (క్షీరాబ్ధి తండ్రి, నేను తల్లిని, లక్ష్మి మా కుమార్తె. వరుడు శ్రీరంగనాథుడు. వీరిద్దరికి తగినట్లు ఏమి కానుకలను ఇవ్వగలను? అని వ్యాకులము చెందినదానివలె కావేరీనది ప్రకాశించు చామరములను, కర్పూరములను, చందనములను, మహామాణిక్యముల సమూహములను కెరటములనెడి చేతులతో అర్పించుచూ శ్రీరంగనాథుని సమీపమున ప్రవహించుచున్నది.) అనుచు పల్కిరి.

నదీజలములు ఒక సమయమున (వర్షాకాలమున) కలసియుండుట, శరదృతువులో తేటపడుటయును సహజముకదా! ప్రస్తుతమున భట్టరు కావేరీజలముల నైర్మల్యమును స్తుతించిరి. కావున కులశేఖరుల సూక్తిని అనుసరించినదగును.

కావేరీనదికి కల ఈ విమలత్వము కేవలము భౌతికదృష్టిలోనేకాక, పరమార్థ దృష్టిలో కూడా సిద్ధము. ఎందులకనగా - సాక్షాత్తు పరమపదనాథునకు ప్రతిరూపమగు శ్రీరంగ నాథుని పాదముల స్పర్శను నిత్యమును కల్గినదికదా కావేరి! గంగానదికి త్రివిక్రమావ తార సందర్భమున మాత్రమే భగవానుని పాద సంబంధము కలుగగా, కావేరీనది దానిని నిత్యము కల్గియుండుట విశేషము. అంతియే కాదు, స్వామిని ప్రకాశింప చేయునట్టి అపూర్వమైన మహిమను కల్గినది. కావుననే గర్వించు గంగాదేవిని చూచి కావేరి పరిహాసముగా నుఱుగురూపమున మందహాసమును చేయుచున్నదనుచు **"శ్యామం వేదరహో వ్యనక్తి పులినే ఫేనైర్హసంతీవ తత్ గంగాం విష్ణుపదీత్వమాత్ర ముఖరాం హేమాపగా"** (మఱుగున ఉన్న వేదరహస్యమును, అనగా పరమాత్మను కావేరీనది మధ్యలోని ఇసుక తిన్నెపై వ్యక్తముచేయుచున్న కావేరి, విష్ణుపాదోత్పన్నత్వ మాత్రముచే 'నేనే అన్ని నదులకంటే గొప్పదానను' అని తన తరంగముల ధ్వనుల రూపమున గర్జించు గంగను నురుగు రూపములో పరిహాసము చేయుచున్నది.) **(22)** అను శ్లోకమున పల్కిరి కదా! మఱియు వైకుంఠనగరమే శ్రీరంగముగా ఆవిర్భవించి నట్లు విరజానదియే కావేరియయ్యెను. విరజ అనగా రజోగుణము లేనిది. ఇది తమస్సు లేకుండుటకును ఉపలక్షణము. దాని ప్రతిరూపమైన కావేరియు అట్టిదే. కావున ఆ నదియొక్క విమలత్వము సిద్ధము.

**వీతకలుషః** - పరమపదమును చేరు జీవుడు విరజానదీస్నానముచే తన కల్మషములన్నిటిని పోగొట్టుకొనును. ఆ పాపపంకిలమంతయు విరజానదికి ప్రతిరూప మగు కావేరీ జలములందు స్నానము చేయుటవలన తొలగునని భావము.

**తత్తీరే శ్రమముషి ఘనవనే** - కావేరీనదీతీరములోని ఉద్యానవనములు సకలవిధ తాపములను తీర్చునవి, నిబిడమైనవియును. విప్రనారాయణసూరి తమ ప్రబంధమున కావేరీనదీతీరములోని తోటల వైభవమును తిరుమాలై ప్రబంధమున వర్ణించుచు, **"వణ్డిన మురలుమ్ శోలై మయిలినమాలుమ్ శోలై కొణ్డల్మీదు అణవుమ్ శోలై కుయిలినమ్ కూవుమ్ శోలై అణ్డర్కోన్ అమరుమ్ శోలై"**, "తుమ్మెదలు మధురముగా ధ్వనించు తోట, నెమళ్ళ గుంపులు చేరు తోట, మేఘములు ఉపరిభాగమున సంచరించు తోట, కోయిలలు కూయు తోట, బ్రహ్మాండనాయకుడు నిత్యనివాసముచేయు చోటు" అనుచు పల్కుట ఇచట స్మరింపతగినది. ఈ శ్లోకము లోని భావములకు మెఱుగులు దిద్దు శ్లోకములను భట్టరు శ్రీరంగరాజస్తవమున రచించిరి. **"త్రయ్యంతప్రహతిమతీషు వైష్ణవానాం ప్రాప్యాసు ప్రచురభవశ్రమాపహాసు, కావేరీపరిచితాసు పావనీషు శ్రీరంగోప వనతటీషు వర్తిషీయ"** (వేదాంతముల అనుసంధానమును అనవరతము కల్గినవి, గొప్ప సంసార శ్రమను పోగొట్టునవి, శ్రీవైష్ణవులకు ప్రాప్యమైనవి, పవిత్రములైనవి, కావేరీనది ప్రవహించునవి అగు శ్రీరంగనగరములోని ఉద్యాన ప్రాంతములలో వర్తింతును.)



**(27)** అను శ్లోకములోని తోటల శ్రమహరత్వమును, **"రంగారామరమ్యస్థలాని క్రముకపనసమోచామేచకాని"** (పోకపనస అరటిచెట్ల సమూహముచే నల్లనివైన శ్రీరంగోపవనములలోని రమ్యస్థలములు) **(28)** అను సూక్తి యందు నిబిడత్వ మును తెలిపిరి. శ్లోకములోని ఘనశబ్దమునకు దట్టమైన అనియే కాక, గొప్పదైన అనియు అర్థము. భగవానుని విహారమునకు ఉపయోగపడుట ఆ తోటలయొక్క ఘనతను తెలుపుచున్నది.

**మహతి పులినే** - ఇచట ఇసుకతిన్నె శ్రీరంగక్షేత్రమే. **"తత్పుణ్యం పులిన మిదంతయాఽద్య మధ్యేకావేరి స్ఫురతి"** **(26)** అనుచు భట్టరు స్వయముగా పల్కిరి కదా!

మూడవ పాదమున **"తత్పుణ్యే"** అను పాఠాంతరము అనన్వితము. **"పుణ్యం పులినమ్"** అను విశేషణవిశేష్యభావమునకు అన్వయింపదు. ఇచటి పులినము శ్రీరంగమే. వేదాంతదేశికుల భగవద్ధ్యానసోపానమున **"ప్రాదుర్భూతం కనకసరిత సైకతే హంసజుష్టే"** (హంసలచే నిండిన కావేరీనదియొక్క ఇసుక తిన్నెలో ఆవిర్భవించినవాడు) అను శ్లోకములోని సైకతశబ్దమునకును శ్రీరంగమనియేకదా అర్థము.

**పూగీకంఠద్వయసపరస స్నిగ్ధనీరోపకంఠామ్**
**ఆవిర్మోదస్తిమితశకునానూదిత బ్రహ్మఘోషామ్।**
**మార్గే మార్గే పథికనివహై రుంచ్యమానాపవర్గాం**
**పశ్యేయం తాం పునరపి పురీం శ్రీమతీం రంగధామ్నః॥** 5

పూగీ = పోకచెట్లు, కంఠద్వయస = కంఠపర్యంతము వృద్ధి చెందినది, సరస = తీయని, స్నిగ్ధ = స్నేహయుక్తమైనది అగు, నీర = నీటిని, ఉపకంఠామ్ = సమీపమున కల్గినది, ఆవిర్మోద = సంతోషము కల్గుటచే, స్తిమిత = స్తబ్ధమైన, శకున = పక్షులచే, అనూదిత = అనువదింపబడిన, బ్రహ్మఘోషామ్ = వేదఘోషను కల్గినది, పథికని వహైః = బాటసారుల సమూహములచే, మార్గే మార్గే = ప్రతిమార్గమునందు, ఉంచ్య మాన + అపవర్గామ్ = సేకరించి గ్రహింపబడు అపవర్గమును (అనగా మోక్షమును) కల్గినది అగు, రంగధామ్నః = శ్రీరంగనాథుని, తామ్ = ఆ, శ్రీమతీమ్ = సంపదను కల్గిన, పురీమ్ = నగరమును, పునః = తిరిగి, పశ్యేయమ్ అపి = చూడగలనా?

పోకచెట్లు కంఠము ఎత్తువరకు వృద్ధి చెందిన, తేనెకూడిన స్నేహగుణమును కల్గినదగు నీటిని సమీపమున కల్గినది, ఆనందమును పొందుటచే స్తబ్ధముగానున్న పక్షులచే అనువదింపబడిన వేదఘోషను కల్గినది, దారిలో ఎల్లెడల పథికుల సమూహము లచే సేకరింపబడిన అపవర్గమును కల్గినదగు శ్రీరంగనాథుని ఆ దివ్యమైన నగరమును ఎపుడు సేవింతునోకదా!

ఇందు శ్రీరంగనగరములోని నీటి సమృద్ధి, ఆ నీటియొక్క భోగ్యత, అచట తోటలో నివసించు పక్షుల సంతోషాతిశయము, ఆ ప్రదేశముయొక్క పావనత్వము, దివ్యత్వమును సూచితములు.

శఠకోపసూరి తమ తిరువాయ్‌మొழி ప్రబంధమున **"తిరువేఙ్గడమ్ నఙ్గట్కు ఒన్నుమే తొழు నమ్ వినైయోయుమే"**, "వేంకటాద్రిని దర్శించిన మాత్రముననే మన పాపములు తొలగును" అని పల్కిరి. కావున భగవానుని దర్శించుటకంటే ఆ స్వామి భక్తులను అధివసించియుండు దివ్యదేశమును సేవించుటయే గొప్ప భాగ్యమని ఏర్పడుచున్నది. అట్టి భావముతో ఇందు భట్టరు "శ్రీరంగనగరమును ఎపుడు దర్శింతునోకదా" అని పల్కుచున్నారు. శ్లోకములోని మూడు పాదములు శ్రీరంగ నగరమును వర్ణించుచున్నవి.

**పూగీకంఠద్వయససరసస్నిగ్ధనీరోపకంఠామ్** - శ్రీరంగరాజస్తవమున భట్టరు **"కదళవకుళజంబూపూగమాకందకంఠద్వయససరసనీరామ్"** అనుచు పల్కుట ఇచట అనుసంధేయము. కావేరీ తీరమున పోకచెట్లు ఎత్తుగా పెరిగి వృద్ధిచెందినవి. కాని కంఠము ఎత్తు వరకు నీటి ప్రవాహము పొంగిపొఱుచున్నది. ఆ ప్రవాహజలము తేనెతో కూడినదగుటచేత తీయనిది. స్నేహగుణమును కల్గినది. **"వెళ్ళ నీర్ పరన్దు పాయుమ్ విరి పొழிల్ అరఙ్గమ్"**, "ప్రవాహజలము వ్యాపించి, ప్రవహించునట్టి శ్రీరంగము" అని తిరుమాలై ప్రబంధమున భక్తాంఘ్రిరేణులు వచించిరి కదా!

**ఆవిర్మోదస్తిమిత......బ్రహ్మఘోషామ్** - కావేరీతీరమున పరమైకాంతులు, వేదవిదులును, నిత్యకర్మానుష్ఠానమును చేసికొని, బ్రహ్మయజ్ఞరూపపారాయణమును చేయగా, దానిని వినిన అచటి ఎఱ్ఱని (అందమైన) నోటినికల చిలుకలు మొదలగు పక్షులు ఆ వేదవాక్యములను అనువదించుచున్నవి. **"అరుమా మఱైయన్దణర్ శిన్దై పుక శెవ్వాయ్‌క్కిళి నాన్మఱై పాడు తిల్లై త్తిరుచ్చిత్తిరకూడమ్"** అని తిరుమంగై యాழ்వార్లు కీర్తించిరి. ఈ సందర్భమున శ్రీరంగరాజ స్తవములోని **"త్రయ్యంతప్రహతమతీషు . . . . . పావనీషు శ్రీరంగోపవనతటీషు"** అను సూక్తి అనుసంధేయము. విష్ణుచిత్తులు తమ పెరియాழ்వార్ తిరుమొழி ప్రబంధమున **"ఎల్లియమ్‌పోదు ఇరుఙ్జిఱైవణ్డు ఎమ్బెరుమాన్ గుణమ్‌పాడి"** (పెద్ద ఱెక్కలను కల తుమ్మెద సంధ్యాసమయమున సర్వస్వామి యగు శ్రీరంగనాథుని దివ్యగుణములతో భక్తితో పాడి) (4-8-8) అని, **"పూమరువి ప్పుళ్ళినఙ్గళ్ పుళ్ళరయన్ పుకళ్‌కుழఱుమ్ పునలరఙ్గమే"** (పక్షిసమూహములు పూలలో అమరియుండి పక్షీంద్రుని కీర్తిని పొగడుచు) (4-9-5) అనియు పల్కుట ప్రస్తుత భట్టరు సూక్తికి మూలము.

**"వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః"** అనునట్లు వేదమంతయు భగవానుని ప్రతిపాదించునదియే. అట్టి వేదమును కావేరీనదీ తీరములోని పక్షులు అనువదించుట అనగా



భగవానుని గుణకీర్తనమును చేయటమే కదా! శ్లోకములోని మొదటి రెండు పాదముల భావమునకు అనుగుణముగా పెరియాழ்వార్ తిరుమొழி ప్రబంధములోని, **"తోదవత్తిత్తూయ్‌మఱైయోర్ తుఱై పడియత్తుళుమ్బిఎఙ్గుమ్ పోదిల్ వైత్త తేన్ శొరియుమ్ పునలరఙ్గమెన్బతువే"** (పరిశుద్ధముగా ఉతికి, ఆరబెట్టిన వస్త్రములను ధరించువారై, పవిత్రమైన వేదమును తమకు నిరూపకముగా కల్గినవారైన శ్రీవైష్ణవులు గంగకంటే పవిత్రమైన కావేరీనదీ ఘట్టములందు గుంపులు గుంపులుగా స్నానము చేయుటవలన అంతట కెఱటములు ఎగసి పడగా, పూవుల నాళములు అటు ఇటు కదలాడినవి. అపుడు ఆ పూలలోని తేనె అచటి ఇసుక తిన్నెలపై స్రవించినది. అట్టి మహిమ కల్గినది శ్రీరంగదివ్యనగరము) (4-8-1) అను సూక్తి అనుసంధేయము.

**మార్గే మార్గే .... అపవర్గామ్** - శ్రీరంగవమున వీథులలో అంతట పయనించువారు మోక్షమును సేకరించి పొందుచున్నారనుటకు దారిలో అంతయ పయనించువారికి ముక్తి హస్తగతమైయుండునని తాత్పర్యము. శ్రీరంగవాసమే ముక్తి అని కొందఱు వ్యాఖ్యానింతురు. **"కావేరీ విరజా సేయం వైకుంఠం రంగమందిరమ్, స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్"** (ఈ కావేరి విరజానది, రంగమందిరము వైకుంఠము, ఆ పరవాసుదేవుడు శ్రీరంగనాథుడు, సాక్షాత్తు పరమపదము శ్రీరంగము.) అను ప్రసిద్ధి కలదుకదా! కావున ఇట్టి శ్రీరంగ దివ్యక్షేత్రమును నేను తిరిగి ఎపుడైన ఒకసారి అయినను సేవింపగల్గుదునా? అని తమ ఆర్తిని భట్టరు ఇందు వెలిబుచ్చిరి. నాల్గవ పాదము లోని **"అపి"** అను అవ్యయము ప్రశ్నార్థకము.

**న జాతు పీతామృతమూర్ఛితానాం**
**నాకౌకసాం నందనవాటికాసు।**
**రంగేశ్వర! త్వత్పదమాశ్రితానాం**
**రథ్యా శునా మన్యతమో భవేయమ్॥** 6

రంగ + ఈశ్వర = శ్రీరంగనాథా!, నందనవాటికాసు = దేవేంద్రుని ఉద్యానవాటికలందు, (నందనవనమందు), పీత + అమృతమూర్ఛితానామ్ = అమృతమును త్రాగి మైకమును పొందిన, నాకౌకసామ్ = దేవతలలో, అన్యతమః = ఒకడను, న జాతు భవేయమ్ = ఎప్పటికిని కాను, త్వత్పదమ్ = నీ నివాసస్థానమగు శ్రీరంగమును, ఆశ్రితానామ్ = ఆశ్రయించినవారియొక్క, రథ్యా = వీథులందు(తిరుగాడు), శునామ్= శునకములలో, అన్యతమః = ఒకడను, భవేయమ్ = అగుదును.

శ్రీరంగనాథా! దేవేంద్రుని నందనవనములో అమృత పానమును చేసి, మైకమును పొందునట్టి దేవతలలో ఒకడను అగుటను నేను కోఱను. నీ నివాసమగు శ్రీరంగమును ఆశ్రయించి, జీవించు మహనీయులు సంచరించు వీథులలో తిరుగు శునకములలో ఒకడనైనను చాలును.

భక్తాంఘ్రిరేణులు తమ తిరుమాలై ప్రబంధమున, **"ఇన్దిరలోకమాళుమ్ అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్"**, "ఇంద్రలోకమును ఏలు ఆ ఆనందమును సైతము నేను కోరను. శ్రీరంగనాథా! ఇచటనే ఉండి నీ దివ్యసుందరరూపమునే దర్శింప గోరెదను" అను సూక్తి ఇచట స్మరణీయము. భగవద్భక్తులలో కొందరు ప్రార్థించునపుడు వేఱు జన్మము వలదని, ముక్తిని ప్రసాదించుమని వేడెదరు. గోదాదేవి, **"ఎత్తైక్కుమ్ ఏழేழుపిఱవిక్కుమ్ ఉన్దన్నోడుత్తోమేయావోమ్"**, "ఎప్పటికి ఏడేడు జన్మలందును నీతో సంబంధమును కలిగియుండుటనే కోరెదము" అని తిరుప్పావై (20) ప్రబంధమున పల్కుటచే ఎన్ని జన్మలు సంభవించినను అవి తమకు అనిష్టములు కావని, ఉపాదేయములేనని తమకు కల్గు జన్మలు అన్నియు దివ్యదేశవాసమునకు అనుకూలములైనచో అవి ఉపాదేయములే అని భావించినట్లు తెలియుచున్నది కదా! ఇట్టి భావమునే పులువురు దివ్యసూరులు వెలిబుచ్చిరి. భట్టరు ఆ క్రమములోనే ఈ శ్లోకమును రచించిరి. మిక్కిలి ఉన్నతమైన దేవతోపభోగమును నేను వాంఛింపను. శ్రీరంగ క్షేత్రమున వీథులలోని తలుపులు తెఱచియుంచిన ఇండ్లలో ప్రవేశించు శునకములలో ఒక్కడుగా పుట్టినను చాలును అని భట్టరు హృదయము. తిరుమంగై ఆழ్వార్ పెరియతిరుమడల్ ప్రబంధములో **"అఱత్తిన్ వழிముయన్ద అన్నవర్ తామ్‌కణ్డీర్‌కళ్ ఆయిరక్కణ్ వానవర్‌కోన్"** అని ప్రారంభించి **"ఇన్నముదమ్ మాన్దిఇరుప్పర్"** అనునంత వరకు వర్ణించిన దేవలోక భోగమును కూడా భట్టర్ ఎంత మాత్రము అభిలషించుటలేదు. నిత్యులు, ముక్తులు సహితము వైకుంఠవాసమును కాదని, దివ్యదేశవాసమును కోరి, అందుల కొరకు తిర్యక్ స్థావర రూపములను కూడా పొందుటకు సిద్ధపడుదురు. ఇందులకు కులశేఖరుల ప్రబంధములోని **"ఊనేఱు శెల్వత్తు"** అనెడి దశకము అను సంధేయము. ఈ కవియే శ్రీరంగ రాజస్తవమున **"అహ్నాతసహజ దాస్యాః సూరయః"** అను శ్లోకమున శ్రీరంగ క్షేత్రమున నున్న మనుష్య-తిర్యక్- స్థావరములన్నియు నిత్యులు, ముక్తులేనని తెలుపుట ఇచట గమనార్హము.

ఈ ఆఱు శ్లోకములతో కూడినదే శ్రీరంగనాథస్తోత్రము. ఇకపై వ్యాఖ్యానింపబడు రెండు శ్లోకములు ముక్తకములని, పిమ్మట ఇందు చేర్చబడినవని పెద్దల అభిప్రాయము.

**అసన్నికృష్టస్య నికృష్టజంతోః**
**మిథ్యాపవాదేన కరోషి శాంతిమ్।**
**తతో నికృష్టే మయి సన్నికృష్టే**
**కాం నిష్కృతిం రంగపతే కరోషి॥** 7

రంగపతే = శ్రీరంగనాథా!, అసన్నికృష్టస్య = (నిజమునకు) నీ సమీపమున లేని, నికృష్టజంతోః = నీచప్రాణియగు శునకముయొక్క (ప్రవేశము అనెడి), మిథ్యా + అపవాదేన = అసత్య మైన నెపముతో, శాంతిమ్ = శాంతికర్మను, కరోషి = చేయుచున్నావు, తతః = ఆ శునకముకంటే, నికృష్టే = నీచుడనైన, మయి సన్నికృష్టే = నేను సమీపించినవాడను అయినపుడు, కామ్ = ఎట్టి, నిష్కృతిమ్ = శాంతిని, కరోషి = చేయుచున్నావు?



శ్రీరంగనాథా! శునకము నీ సన్నిధిలో ప్రవేశించినదను అసత్యవ్యాజమున నీవు శాంతి కర్మను చేయించితివి. కాని, నేను ఆ శునకముకంటెను నీచుడనే! అట్టి నేను నీ వద్దకు వచ్చినపుడు మఱి ఏ పరిహారమును చేయింతువు?

ఈ శ్లోకమును భట్టరు రచించుటకు ఒక సంఘటన మూలమని పెద్దలందురు. భట్టరు ఒకనాడు శ్రీరంగనాథుని తిరువీథి ఉత్సవమును సేవించుటకై తమ ఇంటి నుండి బయలుదేరి, పొన్నచెట్టువద్దకు వచ్చి, అచటనున్న ఆచార్యులతో ఉభయ వేదాంతరహస్యములనుగూర్చి ముచ్చటించుచుండిరి. ఆలయ పరిచారకులు ముందుగా వచ్చి శ్రీరంగనాథుని ఉత్సవమునుగూర్చి తెలుపుట పరిపాటి. ఆనాడు ఎంత సమయమైనను ఎవరును రాలేదు. చాల ఆలస్యమైనను ఏ కారణము వలన స్వామి వీథి ఉత్సవము జరుగలేదు? అను సందేహమును తీర్చుకొనుటకై భట్టరు స్వయముగా ఆలయములోనికి పోయి విచారింపగా, "ఒక శునకము కోవెలలోనికి వచ్చుటచే, అందులకు తగిన శాంతిహోమమును జరుపవలసివచ్చెను. అందుచే స్వామి ఉత్సవమునకు ఆలస్యమయ్యెను" అని భట్టరు తెలిసికొని, శ్రీరంగనాథుని సమక్షమున రస్యముగా ప్రస్తుత శ్లోకమును ఆశువుగా విన్నవించిరి. శునకము ఆలయములో ప్రవేశించినను, ఏదో ఒక మూల దాగియున్నదే తప్ప గర్భగృహములోనికి పోలేదు. అందులకే ఇంతటి పరిహారమును జరిపినచో, ఆ కుక్క కంటే నికృష్టుడనగు నేను నీ ముందుకు వచ్చితిని, ఇపుడు ఎట్టి పరిహారమును చేయింతువు? అనుచు రస్యముగ భట్టరు భగవానుని ప్రశ్నించుట ఇచటి విషయము.

**"మిథ్యాపవాదేన"** అను ప్రయోగస్వారస్యమును కొందఱు పెద్దలు ఇట్లు చమత్కారముగ వివరింతురు. శ్రీరంగములోని ఆలయములో శాంతిహోమము జరిపినపుడు అర్చక-పరిచారక వర్గమునకు ధనలాభము కల్గు అవకాశము కలదు. కావున ఒక్కొక్కప్పుడు వారిలో కొందరు కుక్కపిల్లను బుట్టలో పెట్టి, ఆలయము లోనికి పోయివదలి, "అయ్యో! కుక్క లోనికి వచ్చినదే! శాంతిహోమము జరుపవలెను" అని అందురట. కొన్ని సమయములలో ఇట్టి ప్రయత్నముకూడ లేకనే ఊరకనే "కుక్కలోనికి పరుగెత్తినది, నేను చూచితిని" అని అసత్యమును పల్కి, శాంతి హోమమును చేయింతురట. ఈ విషయము భట్టరు చెవికి సోకుటచే **"మిథ్యాపవాదేన కరోషి శాంతిమ్"** అని పల్కిరి -అని మహావిద్వాన్ ప్ర.భ.అణ్ణాస్వామి వివరించిరి. ముందు శ్లోకమున **"రథ్యాశునా మన్యతమో భవేయమ్"** అని పల్కుటను బట్టి ఈ ముక్తక శ్లోకమిచట చేర్చబడియుండవచ్చును. భట్టరు నైచ్యానుసంధానముకొఱకే తమను శునకముగా పేర్కొనుట శ్రీరంగరాజస్తవము ఉత్తర శతకములోని **"శ్వేవ దేవ!**

**వషట్కృతం త్వాం శ్రియోఽర్థమకామయే"** (దేవా! కుక్క పురోడాశమును ఆశపడి నట్లుగా నేను నిన్ను ఆశపడుచున్నాను.) (99) అను శ్లోకములో కూడ గమనింప తగినది. **"నెడియానై అడినాయేన్ నినైన్దిట్టేనే!"** అను పరకాలసూరి సూక్తి మొదలైన ప్రయోగములు ఇట్టి ప్రయోగములకు మూలములు. గత శ్లోకములోని **"రథ్యాశునా మన్యతమో భవేయమ్"** అనెడి ప్రయోగము కూడా గమనింప తగినది. మహనీయులైన, సద్గుణఖనులైన భట్టర్ వంటి ఆచార్యవర్యులే ఇంతటి నైచ్యానుసంధానమును చేసినపుడు, దోషైకాశ్రయులైన మనవంటివారిని గూర్చి చెప్పవలసినది ఏమున్నది? ఏతావతా నైచ్యానుసంధానము స్వరూపములోనికి అంతర్భవించునని ఇచట గమనింప దగిన అంశము.

**శ్రీరంగం కరిశైల మంజనగిరిం తార్క్ష్యాద్రి సింహాచలౌ**
**శ్రీకూర్మం పురుషోత్తమం చ బదరీనారాయణం నైమిశమ్।**
**శ్రీమద్ద్వారవతీప్రయాగ మథురాఽయోధ్యాగయాపుష్కరం**
**సాలగ్రామఖనిం నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః॥** 8

అయమ్=ఈ, రామానుజః మునిః=శ్రీరామానుజమునులు, శ్రీరంగమ్= శ్రీరంగమును, కరిశైలమ్=హస్తగిరిని, అంజనగిరిమ్=వేంకటాచలమును, తార్క్ష్య + అద్రి = మేల్కోటై అనబడు తిరునారాయణపురమును, సింహాచలౌ= సింహాచలమును, శ్రీకూర్మమ్ = శ్రీకూర్మమును, పురుషోత్తమమ్ = పురుషోత్తమ క్షేత్రమును, బదరీ నారాయణమ్ = బదరికాశ్రమమును, నైమిశమ్ = నైమిశారణ్యమును, శ్రీమత్+ ద్వారవతీ = ద్వారకను, ప్రయాగ = ప్రయాగను, మథురా = మథురా నగరమును, అయోధ్యా = అయోధ్యా నగరమును, గయా = గయను, పుష్కరమ్ = పుష్కరక్షేత్ర మును, సాలగ్రామఖనిమ్=సాలగ్రామమును నిషేవ్య = సేవించి, రమతే = ఆనందించు చున్నారు.

ఇది భగవద్రామానుజుల దివ్యక్షేత్రయాత్రనుగూర్చి నిత్యానుసంధానమును చేయుటకొఱకై ఈ స్తోత్రరచనకు పూర్వమే భట్టరు రచించిన ముక్తకము. మూడవ పాదము మొత్తము సమస్తపదము. **"సర్వో ద్వంద్వో విభాషయా ఏకవత్ భవతి"** అను పరిభాషను బట్టి ఏకవచనాంతము అయినది. **"అయోధ్యాగయాః"** అను విసర్గాంత ముగా కూడ పాఠము కలదు. అపుడు అంతవరకు సమస్తపదము ద్వితీయా విభక్తీ బహువచనాంతరూపము. ఇదియు అర్థవంతమైన పాఠమే.

శ్రీరంగమును, హస్తిగిరిని, వేంకటాద్రిని, తిరునారాయణపురమును, సింహాచల మును, శ్రీకూర్మమును, పురుషోత్తమక్షేత్రమును, బదరికాశ్రమమును, నైమిశారణ్య మును, ద్వారకను, ప్రయాగను, మథురను, అయోధ్యను, గయను పుష్కరమును, సాలగ్రామమును సేవించిన ఈ భగవద్రామానుజముని ఆనందమును పొందు చున్నారు.